

# జయపతాక



కందుకూరి రామభద్రరావు



# జయపతాక

కందుకూరి రామభద్రరావు



ఆంధ్ర రాష్ట్రావతరణోత్సవ
ప్రచురణము

ఆప్తమిత్రుడు, ఆర్ద్రహృదయుడు

శ్రీ మంథా సుబ్బారావు M. B., B. S. నకు

ఆశీస్సులతో

# ప్రవేశిక

రామభద్రరావుగారు నాకు మనసుకలిసిన మిత్రుడు. వారు తమ కావ్యసంపుటికి ప్రవేశిక వ్రాయవలసినదని కోరడము మాసాహిత్యమైత్రికి గౌరవమనే సంతోషము కలుగుతున్నా ఒకపక్క భయమువల్ల మనస్సు సంకోచిస్తూనే ఉన్నది. సాహితీవ్రతులైన తెలుగువారిలో చాలామందికి మామైత్రిని ఎరుగుదురు. దీపావళి అనే నా కావ్యసంపుటాన్ని స్వాయముగా ప్రచురించడమే కాకుండా ప్రస్తావన వ్రాసి ఆ సంపుటానికి విశిష్టత సమకూర్చిన సహృదయుడాయన. ఇప్పుడు నేను ఆయన రచనలకు ప్రవేశిక వ్రాయడము ఎవరికెట్లా అర్థమవుతుందో అని నేను సంకోచపడడము సహజమే అనుకొంటాను. కాని మిత్రునిమాట ఆజ్ఞగా తలంచే స్వభావము నాది. అదిగాక సఖ్యము సాహిత్యసత్యాన్ని మరుగుపరచలేదని నానమ్మకము. జీవితానుభవానికి ప్రతిబింబమైన కళాసృష్టిని, ఆ కళాజీవితముతో నిత్యసంబంధమున్న మిత్రుడు తెలిసికొన్నంతగా మరొకరు తెలిసికోలేరు. అందుచే రామభద్రరావువంటి కవిమిత్రుని రచనలకు నేను ప్రవేశిక వ్రాయడము అసమంజసము కాదని, అది రచయితకూ, రచనకూ ఏమోగాని నాకు

మాత్రము గౌరవవిశేషమే అనే తలంపుతో ఇందుకు పూనుకున్నాను.

రామభద్రరావుగారు కళోపాసకుడుగా, ఉపన్యాసకుడుగా సాహిత్యవిదుడుగా తెలుగువారికి సుపరిచితులైనవారు. ఇదివరకే ఆయన రచనలు మూడు సంపుటములుగా వెలువడినవి. ఇది నాల్గవ కావ్యసంపుటము. లేమొగ్గ, తరంగిణి, వేదన, అనే వెనుకటి సంపుటాలతో బాటుగ ఈ కావ్యసంపుటమును పరిశీలనతో చదివినవారికి రామభద్రరావుగారి కావ్యశిల్పములోని క్రమపరిణతి సులువుగా గోచరిస్తుంది. బరువైన భావాలతో పదునైన నుడికారపు సొంపుతో, చక్కని చిక్కని శిల్పముతో, ఈ సంపుటములోని కావ్యములు, ప్రాయముతోపాటుగ అనుభవమూ, సంస్కృతీ, ప్రగాఢ భావలోకనమూ పెంచిన ఈ రచయిత కళాసృష్టికి రసపుష్టిని చేర్చి రిస్తున్నవని నానమ్మకము.

రామభద్రరావుగారి కుటుంబము అనూచానప్రసిద్ధి గల తెలుగునియోగికుటుంబాలలో ఒకటి. మొదట నుండీ ఈ కుటుంబమువారు సాహిత్యప్రియులు. పండితపోషకులు. కళారాధకులు. రామభద్రరావుగారి పితృపాదులు శ్రీ సూర్యనారాయణగారు కవులను సత్కరించడమూ, పండితులకు వార్షికము లివ్వడమూ, నే నెరుగుదును. వంశానుగతమైన ఆ సాహిత్యాభిమానమే రామభద్రరావుగారి కళోపాసనకు పుట్టకిల్లు.

వ్యక్తి స్వభావాదుల సంకోచవికాసాలకు పరిసరముల బలము ప్రధానమని పెద్ద లంటారు. ఆ బలము రామభద్రరావు గారికి కావలసినంత సమకూరినది. కడలి కౌగిటికి గాతమైనది ఉర్వియంతా ఉద్యానవనము చేస్తూ పాములు పాయలై పయనించిన కోనసీమలోని రాజవరము రామభద్రరావుగారు పుట్టినచోటు. తెలుగు నాటి నందనమని పేరుమోసిన కోనసీమలో, ప్రకృతి సౌందర్యానికి పట్టము గట్టుకొన్న గోదావరీతీరాన, పుట్టిపెరిగిన రామభద్రరావు కళాజీవి కావడములో ఆశ్చర్యము లేదు. ఆయనను ఎరిగినవారికీ, ఆయన రచనలను సవిమర్శముగా చదివినవారికీ, రమణీయప్రకృతికీ ఆయన జీవితానికీ ఆయన కళాశిల్పానికీ ఉన్న బింబప్రతిబింబ భావము స్పష్టముగా గోచరించితీరుతుంది.

ఈ రచయిత హృదయము ఎంత లోతో అంత సున్నితము. అందుచేతనే ప్రకృతిలోని అల్పాల్పవిషయము కూడా, అది సౌందర్యమే కానియ్యండి, సౌరభమే కానియ్యండి, తేజోరేఖ కానియ్యండి, తీయదనమే కానియ్యండి, భావనాస్ఫోరకమై ఆయన హృదయాన్ని స్పందింపజేసి జీవితానికి ఒక అమృతసందేశాన్ని అందిస్తుంది. ఆ సందేశానికి చక్కని రూపురేఖలు తీర్చి, ప్రాణప్రతిష్ఠ చేసి, పలుకుబడి నేర్పి ఒక కళాఖండమును చేస్తాడాయన. అది సహృదయులను పలకరిస్తుంది. నవ్వి

స్తుంది. దారి చూపిస్తుంది. తన్మయులను చేస్తుంది. ఇదే రామభద్రరావు కావ్యసృష్టిలోని శిల్పరహస్యము.

ఈ రచయిత ఒక ఉన్నతపాఠశాలకు ఇప్పుడు ప్రధానోపాధ్యాయుడు. కాని ఆ పదవి ఆయన జీవితాశయాలకూ, ఆదర్శానికీ సరిపడినట్లు తోచదు. ఏ కొద్దిమంది బాలకులకో కాక, దేశాని కంతకూ ఉపయోగపడే సాధనముగా తన జీవితాన్ని నడపవలెనని ఆయన ఆశయు మనుకొంటాను. ఆ ఆశయసిద్ధికై ఎన్నో మార్గాలు కనబడుతున్నవి. కాని కడచినమార్గము 'పన్నగకుటిలఫుత్రోవ'. ఆ మార్గాన 'ఊర్పుగాడ్పులతో త్రసరేణుకలన' రేపుతూ నాల్గు ఘంటాపథంబుల నడిమి మొగకు నల్లనల్లనం జేరిన యీ యాత్రికుడు, 'మార్గసంసూచకాక్షరవర్గ మెసగు ఫలకబాహువులు సాచు కంబమ్ము పొంత' నిలిచి భావియాత్రానుచింతనతో, 'చిరతరాధ్వగపదచిహ్నితములు,సుందరనగరగాములూ, పురాచరిత్రోచ్చములూ' అగు ప్రసిద్ధరథ్యలలో తనకు తగిన దేదో నిర్ణయించుకోలేక "మిహిరు రథము పశ్చిమద్వారతోరణ పంక్తి దాటి నడచునందాక చదికిలంబడునో, లేక నిశ్చితంబౌనో నాపయనించు తెరువు' అని సంశయిస్తుంటాడు. ఈ సంశయమే 'యాత్ర' 'సంశయము' 'పయనము' 'తిమిరయాత్ర' మొదలైన కావ్యాలలో కనబడుతుంది. కాని, ఎప్పటి కప్పుడు

'కలదు నిర్ణీతమార్గంబు పడవ తెలిసవ్వాకరముల పైకి దూకి చేరగావచ్చు నొక రచ్యుతీరము' అనే ఆశావాణి యాత్రోన్ముఖున్నిగా చేస్తూ ఉంటుంది. అందుచేతనే 'అచల మయ్యాది. అట వ్యాదయుంబు నాస్తి. జలనిధీ, శుష్క బోధలు సలుపనేల, విష్ణుపదనర్తతాండవవిలసనమున లోకమున కొనసరించు ముల్లోలలీల' అని ఈ రత్నాకరుడు తన్నుదా నుకోృబోధించుకొంటూ ఉంటాడు. ఈ యాత్రికునికి మార్గసంతుష్టి కలగకుండా ఉండడమే మనకు మంచిది. ఇంకా ఇట్టి కావ్యసృష్టి జరుగవచ్చు. రచయితవలె మనము కూడా 'జీవితానందమధుగానసింధువునకు పొంగులు ఘటింతు' మని ఆశపడవచ్చు.

ఈ సంపుటములోని కావ్యము లన్నీ జీవితప్రవాహముపై బంగరుపూలు పఱచు భాస్కరుని వెలుగు దారులు. ఒక్కొక్క కావ్య మొక్కొక్క ఆనందసందేశము. 'సంసృతి' అనే కావ్యము చదివినప్పుడు 'ఏకోరసః కరుణఏవ' అని చాటిన భవభూతి మహాకవి జ్ఞప్తికి వస్తాడు. 'మధురానుభూతిపై తేలితేలి' మనము కూడా 'మోదఖేదాలె సంసృతి' అనే సత్యాన్ని గ్రహించి 'పండు గీవేళ' అనుకొంటాము.

రామభద్రరావుగారు ఆంగ్లభాషలో పట్టభద్రుడు. ఉద్యోగకాంక్షతో పాఠ్యగ్రంథాలను ముక్కున పెట్టుకొని పరీక్షలో నెగ్గిన పట్టభద్రుడు కాడాయన.

ఆంగ్ల సారస్వతములో ఆరితేరిన మహాకవుల కావ్యసంప దను చూరగొన్న పండితుడు. ఆంగ్ల సారస్వతము లోని లోతుపాతు లెంత మూలముట్టుగా గ్రహించినా, స్వభాషాసారస్వతములమీది అభిమానగౌరవాలను మాత్రము కోల్పోలే దీయన. నన్నయ మొదలు వెంకన్న వరకు తెనుగుకవు లందరి రచనలను చదివి జీర్ణముచేసుకొని, వాటిలోని సాహిత్యమును విప్పి చెప్పగల విద్వద్విమర్శకుడు రామభద్ర రావుగారు. అందుచే ఆయన రచనలలో, వెనుకటి కవుల పోకడలూ, తెలుగు నుడికారపు సొంపూ హృదయంగమముగా కన బడుతుంటవి. తిక్కనో, గౌరనో, నన్నెచోడుడో, చేమ కూర వెంకనో అక్కడక్కడ మాటలమూర్పు చాటున మనలను పలకరిస్తుంటారు. అర్థవిశేషము స్ఫురించేటట్లు చిన్న తెలుగు మాటలను వాడేనేర్పు ఈ రచయిత సొమ్ము. "ఎంతగా మొత్తుకొన్న నావంతయేని చలన మెరుగని కఠినపాషాణహృద్ది". ఇందులో 'మొత్తుకొన్న, చలనము' అనేమాటలు పలుకు నుడికారము బాగా తెలి సిన మహాకవులు మాత్రమే వాడగలరు. 'సన్న ముత్యాలురాల నవ్వే నాముందు' "మిహిరు రథము పశ్చిమద్వారతోరణపంక్తి దాటి శివజటాజూటమల్లికా స్మితమరీచి వెల్లివాడిచె" 'కట్టతెగిపాఱు చీకట్లు పట్టపగట నన్నటులు మూగె కారొన్మెయిళ్లు' "వెన్నె

లంతా నింగి వెలిగొడుగు విప్పింది” ఇట్టి గంభీరభావ వ్యంజకములైన పలుకుబళ్లు తెలుగు కవులలో శ్రీనాథుని వంటి ఏ కొండఱు కవులలోనో గోచరిస్తవి. ఇట్టివి ఈ కావ్య సంపుటిలో కుప్పతెప్పలు.

కవివి నీవును ఆకాశగమన మబ్బె
పుట్టుతోడనె, రసపరిపుష్టప్రకృతి
తన్మయతఁజెంది యేవో గీతముల నించి
పాడుకొందువు లోలోన.

విశేషార్థస్ఫోరకములైన పదాలతో ఈ కవి పక్షికిని తనకును గల సాజాత్యసంబంధ మెంత చక్కగా వ్యంజించినాడో! భావము స్ఫురించే చక్కని ఉపమానములు కవిప్రతిభకు గీటురాళ్లు. ఈ రచయిత వాడిన ఉపమానములు సరికొత్తవి. విరిసిన కాశకుసుములు వెన్నెలపాలు మడుగులు గట్టినట్లున్నవట. ఖగరాజు కంటబడుట వలసలో ఆప్తదర్శనభాగ్య మట్లున్నదట. బ్రతుకు తొలినాళ్లు తిరుణాళ్ళపగిది నడచినవట. ఇట్టి కమ్మని పోలికలు ఎన్నో!

‘హృదయము నీది తీయదన మేచిన స్నేహరసైక దుగ్ధముల్ పిదికెడు పాడియావు’ అని ఒక భావుకుడు రామభద్రరావుగారిని గూర్చి ఒకప్పు డన్నాడు. ‘సౌందర్యదేవత’ అనే కావ్యము చదివితే ఆమాట సత్య

మని తోఁచితీస్తుంది. సౌందర్యదేవతామందస్మితము అదృష్టము పండినవారికే లభించునట. అది ఈ రచయితకు లభించినది. లేకుంటే "ఒకప్రొద్దై నిలిచినా, ఒకప్పాటె వలచినా, బ్రతుకొక్క నవ్వుగా పరిమళించిన చాలు" అని అనఁగలడా ఈయన?

సంఖ్యకు తక్కువైనా ఈ కావ్యాలన్నీ గుణబాహుళ్యానికి కుదుళ్ళు. ఆ గుణాలన్నీ వెల్లడించడానికి ఈ ప్రవేశిక చాలిన చోటుకాదు. ఆచోటు సహృదయులైన చదువరులే.

ఒక్క తుదిమాటతో ఈ ప్రవేశికకు స్వస్తి చెప్తాను. రామభద్రరావుగారు తమ యీ కావ్యసంపుటిని డాక్టరు మంథా సుబ్బారావుగారికి అంకితము చేశారు. కృతిభర్త, కృతికర్త, యిరువురూ నాకు మిత్రులు. వారిరువురూ నిరాడంబరహృదయులు. కళారాధకులు. సమస్వభావులు. రసముగ్ధులు. ఆ యిరువురి కావ్యబాంధవము నాబోటి మిత్రునికి ఎంత సమ్మోదమో మాటలలో వెల్లడించ శక్యముకాదు. ఆ బాంధవము పచ్చకప్పురమునకు రుచి. పండువెన్నెలకు తావి.

సామర్లకోట,
భాద్రపద బహుళ విదియ. } వేదుల సత్యనారాయణశాస్త్రి.

# జయపతాక

ఇదే త్రివర్ణ జయపతాక
ఇదే త్రయీపథపతాక
ఎగురువేళ రండి రండి
ఎదుర నిలిచి మ్రొక్కరండి

ధవళకథిత స్వచ్ఛశీల
హరితవినుత సకలభాగ్య
పింగళాంశు ప్రథితజ్ఞాన
ధర్మచక్ర రచితమార్గ ఇదే...

అశ్రుమౌక్తికములుగ్రుచ్చి
అసృగ్రుచుల లాక్షపూసి
అసుప్రసూన పూజసల్పి
అమరవీధి కెత్తినారు ఇదే...

మన స్వతంత్రభారతాత్మ
ఘనప్రపంచశాంతివర్త్మ
దశదిశాంతకీర్తిసద్మ
ధన్య ధన్య ధన్య రండి ఇదే...

# స్వాగతము

రావమ్మ మాయమ్మ
రా భరతజనయిత్రి
రమ్మ త్రిశతకోటి గ
శమ్మ స్వాగతమమ్మ

హిమశైల కైలాస
హీరరుచి తోరణ
గంగాతరంగ మం
గళ ఋజుభాషణ రా॥

పుత్ర పుత్రీహృదయ
ఫుల్ల పంకజపత్ర
సురభిళాహ్వాన సం
శోభితారుణ చరణ రా

మధుర దరహాస స
మ్మానిి తానన పద్మ
కరుణా తరంగి తాం
తర శాంతరస సద్మ ॥రా॥

ఈశ్వరాగమ సూత్ర
వీధీవిహారిణీ
విశ్వకళ్యాణ సం
ప్రీత హృత్కారిణీ ॥రా॥

# సౌందర్యదేవత

ఓసి సౌందర్యదేవతా! ఓ సుహాసి
నీ! అమరలోక వాసినీ! నిత్యనవ వ
సంత సుషమా విలాసినీ! సరసహృత్సు
వర్ణ సామ్రాజ్యరాజ్ఞి! కృపామయాక్షి!

అరుణరాగ విభాసితాధర మనోజ్ఞ
మధురహాస శుభోదయ మానితమయి
రహిఁ రహస్స్థిరసీమ నారాధనంబు
సలుపు మామక హృత్కుశేశయము నీకు

ఏ యదృష్టమొ పండి జనించు వాని
కొక్కనికె గాని దొరకని యుష్మదార్ద్ర
హృదయ గతమా మధుస్మిత మీ యభాగ్యు
కడ వృథా యనకు బహిఃప్రకటనఁ గనక

వడిగ నిమ్నోన్నతంబుల బడుచు లేచు
జీవికారథశ్లథకుఁ గృశించి, నాదు
హృదయసింహాసనస్థకు నెలుగునెత్తి
పాడుకొనలేదు గీత ప్రబంధములను

ఇచ్ఛగలదింక, జీవితోన్మేషశక్తి!
బ్రదుకఁలూహింపగల నవవసము లందు
పాడుకొందు నీ మృదు కరాబ్జమునుబట్టి
దివ్యలోకపుఁ దీరాలు తిరిగి తిరిగి

పాడగలవేళ లేదేని భావనమున
నిల్చు నీరూపుపొల్పు నిర్నిమిషదృష్టిఁ
దనువు పులకింపుతోఁ గాంచి తత్పరతనె
అర్చన మొనర్తు లోన నిన్నమృతమయుని

# క్షమాపణ

తెలుగు పూఁదోటలోని పూవ్వులరెమ్మ
లచ్చటచ్చట దర్శించి యమృతశోభ
నల్లములరంగ నర్తించి, యూహలోన
కట్టుకొన్న మద్భవనప్రాంగణమునందు

కంటి కింపొనరింప మొక్కలను నాల్గు
నాటుకొన్నాడ ; నాల్గుక్రొన్ననలు విరిసి
పాయగము పెంచి, నించి రసాయనంబు
బ్రదుకుబాటల రేఁపు స్వప్నముల నెన్నొ

పరిహసింపకు పాంథుడా "వన మహోత్స
వ, మొహమా!" యని లోన నాయెదఁబదను పెట్టు
సుందరారామ దర్శనోత్సుకత కిద్ది
యొక క్షమాపణసుమ్ము తీరికలు లేమి.

# వెలుగుదారి

రమ్యగోదావరీ జలరాశిపైని
ఈ వెలుగుదారి బంగరుపూవు పఱచి
సంతరించెడు నుదితభాస్కరుని తరుణ
కిరణపుంజము తూర్పువాకిటికి త్రోవ

నూతనోత్సాహ సంభృతానూనగాన
సంపదలు నిండు మారుతోచ్చాలనమున
ఈ ప్రభాత శుభోదయ మీ ప్రపంచ
వాసనలుమాపి స్వర్గశోభలను రేపు

స్వాంత ముప్పొంగి యుజ్జ్వలపథము వెంట
ప్రాచ్యదుర్గ కవాట సోపానమెక్కి
లోకభాస్కరమండ లాలోకనమున
తాండవముసేయఁ బాడుప్రస్థానగీతి

# తెప్పతిరునాళ్లు

రండమ్మ రండి, రసలవెలుగులతోడ
తెరలి రారండి తెప్పతిరునాళ్లు!

శ్రీనృసింహస్వామి శ్రీదేవితో గూడి
కార్తికీజ్యోత్స్నలో కడలి కరడులపైని
ఉయ్యాలలూగగా ఊరేగివచ్చేను రం...

వెన్నెలంతా నింగి వెలిగొడుగు విప్పింది
హరితాంకురాలతో అవని పులకించింది
వేయిదివ్వెలతోడ వేంచేయు సామికై
హాయిగా సాగు సన్నాయిమేళము రండి రం...

వెండితళ్కులచీర వ్రేలాడు కుచ్చెళ్లు
గొప్పింటి ఒయ్యారి గోదావరీగంగ
ఆదరికి ఈదరికి ఒదుగుతూ తావచ్చి
నిజనాథుపజ్జనే నిలిచి మ్రొక్కింది రం...

౯

సాగరుడు చేపట్టి చపలంటగా లేచి
పరవళ్లుత్రొక్కుతూ పాల్కడలి తానై
గోదావరీదేవి కొంగుకొంగా కలిసి
స్వామి కెదురుగ వచ్చి స్వాగతం బిచ్చెను

పల్లెపడుచుల నగవు పాలల్లె చిందగా
తెల్ల పూదెప్పపై తేలిసాగును స్వామి
జేజేలు నల్దెసలు చేరి మార్మ్రోగెను
క్షీరసాగరశయను సేవింప రారండి

సాగరుడు శయనమై సంతరించెడు వేళ
మేళాలు తాళాలు మిను బాణసంచాలు
కోలాహలమ్ముగా కొలువుదీర్చెను స్వామి
అభయహస్తము నెత్తి ఆశీర్వదించేను

(అంతర్వేది–క్షీరాబ్ధి ద్వాదశి)

# మల్లెపూవు

ఓపలేనే మనసు
ఓ మల్లెపూవ!
దాచలేనే వలపు
వేచు నా యెదలోన

మలిన మెఱుగని బ్రతుకు
తెలినగవుతో గులుకు;
పరిమళపుం బిలుపుతో
పరవశుని జేసేవు ఓప...

ఆశా మేల్ముసుగులో
అందాలు చిందేవు
రాచబింకముతోడ
చూచేవు నావంక ఓప...

రవగాలి యూచేన
చివురాకుటుయ్యాల
ఎంత ఒయ్యారమే
ఎగసిపోవు నెడంద ఓప.

ఒకప్రొద్దె నిలిచినా
ఒకపూటె వలచినా
బ్రదుకొక్క నగవుగా
పరిమళించునె, చాలు ఓప..

# ఖగరాజ!

సంజచెంగావి చెంగులు జాఱనడువ
మిసిమిబంగరుటంచుల మెఱయుచున్న
పశ్చిమాకాశపథమున నిశ్చలముగ
వలయములుచుట్టి యెగసెదు పక్షిరాజ!

లాతియండజపంక్తి కులాయములకు
చుట్టుపల నార్చి పాఱెడు సందడులకు
విముఖత వహించి వెలిగ విన్వీధినుండి
కాంచుచుంటివె సంధ్యావికాసప్రకృతి

ఎన్ని యేండ్ల పొంగు లిముడ్చుకొన్న చాన
వృద్ధగౌతమి సాయంప్రవృద్ధరాగ
సంపదల స్నాతయౌచు ప్రశాంతసరణి
దర్శనమున నొసంగు చైతన్య మేదొ

సంజకెంజాయ తెర లపరంజిలించు
తటమహోద్యాననిత్యసౌందర్యలక్ష్మి
మధుర హాసోపశోభిత మౌనభాష
నేదదేర్చును కలగిన జీవనముల

కవివె నీవును నాకాశగమన మబ్బె
పుట్టితోడనె? రసపరిపుష్టప్రకృతి
తన్మయత జెందె యేవో గీతములు నించి
పాడుకొందువు లోలోన నీడజంబ!

కలచు జీవితక్లిష్టసంఘటన స్మృతికి
మఱపుదలుపు బిగించి నెమ్మదిని నూత
కూరుచుంటి నొంటిగ నదీకూల మొరయు
హరితతృణకశరంజి తాస్తరణభూమి

ఈ మనోహరప్రకృతిలో నెగయు నిన్ను
గన్న సాజాత్యసంబంధకలన యేదో
వలసలో నా ప్తదర్శనభాగ్య మటుల
నా యెడంద నలర్చి యానంద మొసగు

ఓయి ఖగరాజ, రాగదే యుల్లసమున
అనుదినంబునునిటుల సాయాహ్నసమయ
సుందరాకాశపథమున డెందమలర
పాడుకొందము ప్రకృతిసంపదలు నించి.

# ముసలి - దివ్వె

నేను :

ఇరుల తెరలు విరియుచోట
ఒరులు నరులు మరలుచోట
తడియారెడు ప్రమిదలోన
కొడిబారెడు కునుకుదీప
మొగద్రోయుచు వాపోవుచు
మొగమెత్తని ముసలివరుగ
వెవరనయ్యా ! ఎవరవయ్యా !

ఎండుటొడలి
పండుముసలి
నఱవెండ్రుక వెఱగుంపుల
తెరవైచిన కొఱచూపుల

బుడుతనడక బడలుగొనక
వడకుచేత మిడుకజ్యోతి
పుడికినిలిపి మనికిగడుప
ఎందుకయ్యా! ఎందుకయ్యా!

ముసలి :

పాంథప్రగతి
కంథజగతి
కనువెలుగై మనుదీపిక
మినువెలుగై చనుదీపిక
వాడవారు వదలిపోవ
పాడువాఱు పంచనిలిచి
కునుకకుండ మినుకునిలిపి
కునుకకుండ మనికిగడపు
చుంటినయ్యా! ఒంటినయ్యా!

హరునికంట
విరియుమంట
విలయకేళి
వెలయువేళ
లోహదాహదోహ;మున
ఈహమోహవాహనముల

పరుగువారి
విరుగువాగు
పంచ వదలు
మించుదివ్వె
కొడినిగట్టి కునుకకుండ
తలతునయ్యా! తెలతునయ్యా!

ముసలివముగ
నుసుము రాలు
విషఘనమయు
మొసగులోన

ఎన్నడేని, ఎవ్వారేని
కన్నవారు మిన్నవారు
జోతి గలిపి
జాతి మలపి
ప్రగతి గలుగ
జగతి వెలుగ
వచ్చునాశ, హెచ్చునాశ
ఉంటినయ్యా! ఒంటినయ్యా!

# సంస్కృతి

"కట్టుకొన్నాడ క్రొత్తచొక్కా యిఁకాదు
పండు గీవేళ పెట్టెద నఁడి దండ"
మనుచుఁ గైమోడ్చి నన్ను ముత్యాలు రాల
నవ్వె నాముందు నటరాజు నన్ను జూచి

నిండుజాబిల్లి రేకలు నిగుడు వేళ
పాలవెల్లిగ లోపల పరవశమయి
ఒడిని జేర్చి ప్రేమాడోలోచ్చలనని
అందుకొన్నాడ స్వర్గసీమాంచలమ్ము

హేలగా వ్రేలి కదలు నీలాలయలక
గుంపులందున మెఱయు కుంకుమము దిద్ది
అంతికంబున నవ్వు నాయింతి నయన
కాంతితారల నాహూపె కంటి నపుడు

అంతః హృదయపాతాళబిలాంతః మెసలి
ఒక ముహూర్తమునందె పైకుబికి వచ్చె
కాలమాంత్రికహస్తసంకలిత మైన
మరుగుతెర గాల్చి స్మృతీయొంపు మంట లెగయ

దశవసంతాలవికసనోత్సవము నెఱపి
అమరలోకప్రదీపంబులైన యట్టి
చిట్టినాతండ్రి నాయన్నచిట్టితల్లి
తలపున న్నిల్వ దుఃఖాగ్ని తలుపు తెరచె

నందనానందసమయవిఘ్నముగ నెంచి
కుత్తుకల మ్రింగి శోకాగ్ని కుటిలహాస
వికసనమ్ముల మారాజు వెడల నంపి
మూకశోకానునయముల మునిగినాము

ఎంత ఏడ్చిన ఫలసిద్ధి యంతియ కద
తేల్చు మధురానుభూతిపై దేలి తేలి
కాల్చు విషదిగ్ధచింతనఁ గనలి కనలి
మోదఖేదాల సంసృతిఁ బోవుద మిటు

# ఉద్బోధ

అచల మయ్యది, అట హృదయంబు నాస్తి
ఎంతగా మొత్తుకొన్న నావంత యేని
చలన మెఱుగని కఠినపాషాణ మద్ది
జలనిధీ! శుష్కబోధలు సలుప నేల

తరగచేతుల లాలించి నరువునవ్వు
ప్రకటనముచేసి రేయుంబవళ్లు నెనరు
తోడ వేడినం గరగని మోడుఱాతి
కేల ఘోషింతు నిరతంబు జాలితోడ

నీవు రత్నాకరుండవు, నీయెడంద
నిరతనిర్మల, మాపగల్ నిన్ను బొందు ;
జీవరాసుల కాశ్రయ మీవ, చంద్రి
కావిలసితాంబరశ్రీలకై చలింతు

—౨—౨

సహజసుందర వార్నిధీ! సాహితశక్తి
విలసితానంతనిత్యగంభీరమూర్తి!
విష్ణుపదసక్తతాండనవిలసనముగ
లోకమున కొంగరింపు ముల్లోలలీల

# ప్రవాసము

ఎంత యానందమును బంచి, ఎంత బ్రదుకు
మధురయాత్రగ నొనరింప మధనపడితి
నంతకంతకుఁ జింతాబిలాంతరమున
కుమిలి యడగారు లోని శక్తులును జాత్రి

పూలు విరియు వసంతసంపూర్ణతలకు
చాలు లుబుకు చంద్రికాప్రసారములకు
మేలుకనుపు ప్రభాతసంచారములకు
బ్రదుకు తొలినాళ్లు తిరునాళ్ల పగిది నడచె

కాఱు రాతిరి మొయిలు చీకటులు క్రమ్మి
చినుకఁజీదరఁ దెరువరి చిత్తమటుల
నుత్తలంబంది ఊరియాడు నోయి బ్రదుకు
ఏదొ యవరోధపట మావరించి నేను

సౌహృదముల కొల్వుకూటమ్మై, స్వాదుప్రేమ
మాధుర్యపంథమ్మై, వందిమాగధులు సు
ధలు మోపి పాడు శ్రావ్యగీతప్రబంధ
మ్మై, మనోజ్ఞమృదుహాసమ్మై యలరె నాడు
వెలుగు నైపసి చీకటిపులుంగు చెలువుగా
తెలుగు సారించు చోటుల నేతవాగ
హాసశోకసంతాపాగ్ని మరగి మరగి
ఈ ప్రవాసదినాలు లెక్కింతు నిప్పుడు
ఉరకలను వైచి క్రీడించు కురరి యుగాల
వాగురను జిక్కి, కృశియించి పసవు పగిది
స్వైరసంచారశీలభావనల నెగయు
బ్రదుకు చివుకు ప్రవాసనిర్బంధనమున
ఎపుడో కవితావిపంచి ధరించి కేల
లీల నవరోధనగశిఖరాలు దాటి
జీవితానంద మధుగానసింధువునకు
పొంగులు ఘటింతు ననుచు నాశ పోవ దెపుడు.

—శ్రీ

# నిస్పృహ

కుండపోతగ దినముఁ గొలది కురిసి
మిఱ్ఱుపల్లంబు లేకమై మెదల నీదు
ముడిచి తడిఱెక్క లాకుచెట్టు మొదల జేరి
దుర్దినవిషాదభారంబు ద్రోవ నెంతు

కట్టతెగి పారు చీకట్లు పట్టపగళు
లన్నటులు మూఁగె కార్మొయి ళ్ళాకసమున
కాల మెదురైన ప్రాణికిఁబోలె సకల
వస్తుచయము నీరోడు బరువు బలిసి

తెరపి దొరకని బ్రదుకులో నిరుకుకొన్న
కోర్కె లొక్కటొక్కటిగఁ గూర్కొన నశింప
ఉబుసుపోకకు మనస్సులో నురిసిపోవ
సంఘటన లేరి మరిమరి సద్దుచుండు

ఱెక్కలు విదల్చి, ఎలుఁగు సారించి వెలుగు
వెల్లులు పొడుచు నాకాశవీథి కెగసి
నిరతసంగీత వలయముల్ దిరుగ నోచి
పాటతేనెలఁ జిలుకు పిట్టికో స్వామి!

# సంశయము

పన్నగకుటిలభ్రాంతిఁ బడలి యూర్పు
గాడ్పుకొసలందుఁ ద్రసరేణు లన రేఁపి
నాల్గు ఘంటాపథంబుల నడుమ మూఁగను
నల్ల నల్లన జేరిన యాత్రికుఁడను

మార్గసంసూచకాక్షర వర్గ మెసఁగు
ఫలకబాహులు సాచు కంబమ్ము పొంత
భావియాత్రానుచింతనాపరుఁడ నగుచు
కూరుచుంటి పేరాఁకొన్న కుతపవేళ

సూచితపథంబులన్నియు సుందరోరు
నగరగాములె, చిరతరాధ్వగపదాబ్జ
చిహ్నితంబులె, లోకప్రసిద్ధరథ్య
లే, పురాచరిత్రోచ్చవాక్స్థాపితములె

ప్రథితసుందరనగరశోభాసదృశ
సర్వసంశ్లిష్టమార్గా సరణాంతకు
వ్యర్థజీవితచింతనాభాసబీజకు
సుడిగ లోలోన హృదయసంక్షోభ రేఖ

మింటి నడుచక్కి కెక్కిన మిహిరు రథము
పశ్చిమద్వారతోరణాపంక్తి దాటి
నడచునందాక చక్కిలంబనుడై యుగానో
నిశ్చితం బౌనో నా హృదయాని చూచు తెరువు

# యాత్ర

రాపిడులతోడ నలిగి వారాశిపైని
సాగి నడుచు పడవ తెరచాప విప్పి
నిదురపోవునో పవనుండు కదలబోడు
బూరటిల్లదు తెర నిద్రపోయినటుల

పడవ నడుపంగఁ జుక్కాని పట్టియుంచు
నన్ను బంచితి వా మూతకన్నుగవను
నిదురబరువెక్కి వ్రేలఁగా మొదలఁ జేత
కర్ణమును జుబుకంబు మోకాల నిలిపి

సగము నిద్దుర మెలకువ సగము కాఁగ
గడల కందని పెనునీటఁ గలము నడుప
బాహుబలమున మెడ్డింప నూహాసేసి
ఓపి కెక్కుడిదని యెంచి యూరకుందు

దెసల మసలు గుసగుస పలికెంచె నంత
"కలదు నిర్ణీతమార్గంబు; గాని కదలు,
పడవ తెలినవ్వాకరములపైని దూకి
చేరగా వచ్చు నాకరమ్యతీర" మనుచు

ప్రస్ఫుటము, నిగూఢమ్మునై స్ఫురించి
ఆశయే జిగ్గి రెక్కల నార్చుకొనుచు
భావనాకాశరోచిరధ్వమున నెగిరె
అదియె నీయాజ్ఞగా యాత్ర కాత్రపడితి.

## పయనము

జననసంగను దేశవిచ్ఛేదనము లేక
సాగు కాల ప్రవాహవిశాలవారిఁ
బుట్టుతో నెక్కి పడవపైఁ గొట్టుకొనుచు
పోవుచున్నాఁడ నీటిత్రొప్పులకు గదలి

ఏటి కెదురేగ తెరచాప నెత్తి త్రెన్ను
త్రాళ్ళు బిగియించి యెన్నో యత్నముల నెపుడు
సలుపుచుంటి నె కాని ఫలంబు లేదు
నీటి కెదురెక్కి జాడ యీనాటి కేని

రమ్యజీవితలక్ష్యతీరమ్ము పైని
లంగరుఁ జుట్టకై బాహులం గ్రహించి
తోటమహారణ్యసుందరోద్యాననగర
కలితదృశ్యపరంపరం గనుచు నిలుతు

తటవినిర్ణయముం జేయ దార్ఢ్య మేది
సంశయాకులచిత్త మాశలనె ప్రాక
చేత నెత్తిన లంగరు చేత నుండ
నీటివాలునఁ బడి జాఱుపాటె తోఁచు
ఏటిలోపల తొలినాళ్ల నెత్తు చాప
త్రాటిబిగువున వ్రేలాడు నీటిపజ్జ
నలిగి బిగువఱి వ్యర్థయత్నమున బోవు
పడవ కెయ్యది లక్ష్యమో పాలుపడదు

# తిమిర యాత్ర

కంటి కొక కూర్కు లేని చీకటులు పేరు
నగము రాతిరి చన్న నిశ్శబ్ద వేళ
నా మనస్సొక విహగమై పథము కనని
పథమె తెలియని బయలునం బయన మయ్యె

ఎగురుటయె నైజమో తెలియింప లేని
ఆశయమె లేని త్రిష్ణనో వ్యర్థగతుల
ఇరుల భండారమున బడి యెగసియెగసి
రేయికొన నంట రెక్క సారించి పోవు

పారమే లేని తిమిరకూపారమందు
నలపుటూర్పు పరంపర కలసిపోవు ;
పులిసి వ్రేలాడు జోడురెక్కల కుదుళ్ళు
సోలి జీర్ణపర్ణమువోలె వ్రాలు భువికి

అంధతమమునఁ దల కదలాడ విరియు
పొదరులోఁ జిక్కి స్పృహ యేఁది చెదరుఱెక్క
పఱపుపట్టున వ్రేలాడు పక్కి యెపుడు
దిక్కు తెలియగ ఱెక్కాడు తెలివి కనునో

# పౌర్ణమినాడు.

కార్తికమాసచంద్రికాకాంతిపుంజ
ములు నటించెడు గౌతమీజలములందు
సద్దుమణగిన యర్ధనిశాప్రశాంత
వేళ విహరింప దోనెపై వెడలినాడ

పడవ నడుపు చుక్కాని త్రోపుల నెకలి
కలతనిద్దుర గంగమ్మ కలవరించె
మినుకు బేడిసచేపలు కనులు తెరచి
జల్లుసందుల బొరలాడి మెల్ల నవ్వె

పాయలందేలు లంకల చాయలందు
ముమ్మరమ్ముగ గాశసుమమ్ము విరిసి
పండుపున్నమి వెన్నెలపాలు కురిసి
మడుగులంగట్టి పొంగిన పడువు తోచె

శివజటాజూటసుస్థితకాంతిమరీచి
వెల్లివిరియగ జగతి ప్రఫుల్ల మగుచు
స్నిగ్ధపీయూషధారాభిషేచనముల
ఆర్ద్రమై సిగ్గు మౌనముద్రాంకిత మయి
రేయి యంతయు నొక్కటే హాయితోడ
స్వప్నసుందరదృశ్యమై సాగుచుండ
పాటువడె నేను, నీటిక్రొవ్వడికి పడవ
కొట్టుకొనిపోయె నది వార్ధిఁ గూడు కడకు
పడవ దిగలాగు నీటి ప్రవాహసరణి
సద్దు రవ్వంత లేని ప్రశాంతప్రకృతి
ఎదియొ లోకపుఁ బిలుపుగా నుదధిఘోష
అపుడు స్ఫురియించె ప్రాణప్రయాణ మట్లు
భయము మూగిన యెడదతో పడవ నడిచి
పారమే లేని వారాశిపైని సిలచె
జిలుగువెన్నెల తెర పీడి వెలుగు లెసగ
తూర్పుమలపైని ఉదయించె తొగరుప్రొద్దు

# తీతువు

అఖిలజగదీశనాథు ప్రయాణవేళ
రమ్యగాత్రీమాపుణ్యశరీరములఁ బెరుగు
గుబురుతోటలలోన ఘంశాకోకిలమ్ము
పాడు గొంతెత్తి పంచమస్వరమునందు
నూత్న నూత్న జీవాంకురానూనరుచిర
రత్నభూషణాలంకృతారామపంక్తి
గానరసపారవశ్యమై కదపు శిరము,
జలమయంబయి గంగమ్మ మెలికదిరుగు
ఎందుకీ యార్తి తీతువా యెగసి యెగసి
తిక్తహృదయాన గల్మషోద్రిక్త వగుచు
కొంప సదుకొప్పునంబడి కూసెదిటుల
వినినవారు ఛీ ఛీ యని విసరికొట్ట

చూతపల్లవఖాదియై చొక్కు భోగి
తరుణమధుమాసశృంగారతరునివాసి
మాధవాగమనోత్సవమాగధుండు
కవిప్రశంసితప్రచ్ఛన్నగాయకమణి

పోలికా నీకు నతనికి? పుడక లేరి
యినుకదిబ్బలరెల్లులో నిల్లుకట్టి
దొంగయొఱపున జిఱుమీల మ్రింగి, నింగి
విఱుగబడి చావులం గోరి యరచు నంత

# నాగన్న

తలను ధరియించు విష్ణుపాదములు పాన్పు
మణివిభూషణశ్రీలలో మినుకులీన
పడగ పైకెత్తి విహరించి వాములూరు
నడిమి చక్కని నొక్కెడ పడక వాల్తు

వనమూలందున వసియింతు పవనభక్ష
ణమున జీవించి, కనులు కర్ణములుకాగ
మధురసాస్వాదనమునఁ దన్మయతఁ జెంది
యూగిపోవుదు వొక మహాయోగి వోలె

ప్రాతపడునంత సడలు కుప్పసము లెల్ల
నూడ్చివైచెదు నిత్యతేజోజ్జ్వలమ్మున
రాణకెక్కెద; వుసురులు రాలువేళ
నష్టపడియెదు గరళమే యమృతమగుచు

"కాలకంఠుని హ స్తకంకణవిభూష
జలజనయనుండు శయనించు మలకపాన్పు
సాధ్వి సర్వంసహాదేవి చరణపీఠి
మీ కులస్వాము లెంతేని మిన్నలు కద !

ఎంతలో మారితీవు బంధించు నంత ?
పాములయ్యాకు చౌరకాయ పాట కాడి
పొడిచినంగూడ బుస్సని పడగ విప్పు
నోప కెపలిన నాగన్నలోయి యిప్పుడు.

# స్వాతంత్ర్యము

"ఈ యశాంత ప్రపంచమం దెటులా బ్రదుకు ?"
నా భయమ్మున రక్ష కొనర్చుకొనెడు
పరికరమ్ము లయోమయపంజరమయి
నన్నె బంధించు దృఢమయి నాడునాడు

పక్షివలె భావనాకాశపథమునందు
స్వైరగతి సంచరించిన స్వాంత మిప్పుడు
పంజరనిబద్ధమై నుంతె బయటపడగ
బాధతో ఱెక్క లుక్కుకంబాల మోదు

ఎంతగా మోదుకొన్న రవ్వంత విడని
కమ్ములం బట్టుకొని వ్రేలి సొమ్మసిల్లి
అలపుటూర్పు పరంపరఁ దెలుచుకొన్న
పర్ణములలోన శిరముంచు బడలు పోవ

౮_౨

స్వీయము నిర్మించుకొన్న నిర్బంధమునకు
పైకి వగచినఁ బరుల కెవ్వరికి జాలి?
బయటి కుబుకంగనీక లోపల సడంప
బరువుచేటున నాయెద పగులునేమొ?

ఏవెరవు లేక లోన వాపోవు నెడదఁ
బలుకుచున్నార లెవ్వరో "భయమె తొలఁగ
నుక్కు కష్టాలు వీడు నిం కొక్కటొకటి
స్వాంతమంతట స్వైరమై సాగు" నంచు.

భయము పోద్రోల ధైర్యంబు వన్నె మొసలఁ
జిరతరావాసశక్తి నెదురును భయము
సంగరాంగణవిజయవిశ్రాంతితోడ
బ్రదుకు కేనాడు స్వాతంత్ర్యప్రాభవమ్మొ!

# సృష్టి

రగిలి పర్వతహృదయంబు పగిలి పొగలు
సెగలు నాకసమంటగా శిఖలు చాచి
పాఱు 'లావాగ్ని' నాల్కలు చేరు జేన
మొక్క త్రుటిలోన మాయమవా నూహదాటి

వసుధ కంపించి వననగహ్వరము తెఱవ
నొక్కపెట్టున జొరబారు నూళ్లు పురము
లెన్నొ కబళంబులై భరియింపరాని
క్షోభతో దగు బాతాళకుక్షి వఱకు

పవను డాగ్రహోన్మత్తుడై వనధిపైని
విలయతాండవకేళితో వెలయునంత
చాపకట్టుగ వ్రాలి దేశంబు మునిగి
తిప్పపాలగు నొక్క దుర్దినము నందు

ఏండ్లు పూండ్లును బెరిగిన వెన్ని యెన్ని
ప్రకృతిలో మాయమగా తప్పపాటులోన్న
పరిమితప్రజ్ఞ వర్తించు నరుని బుద్ధి
కొలువలేదోయి బీభత్సముల తెఱంగు

కఠినబీభత్సనాశన కారణంబు
నొక మహాకృషి కాది కానోవు స్వామి!
అమృతహాలాహలముల వ్యత్యాస మేమి?
బొమ్మ బొరుసులె కాక సంపూర్ణ సృష్టి

రంగి

ఇతరకృతులు :

లేమొగ్గ

తరంగిణి

వేదన

చిత్ర



పేరూరు

తూర్పు గోదావరి

సరస్వతీ పవర్ ప్రెస్ — రాజమండ్రి